Reg. No. 7

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.




గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 7 | 1915 జూన్ | సంచిక 6

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

పోషకులు.

1 శ్రీ రాజానారయప్పారావు సింహాద్రిఅప్పారావు బహాదరు జమీందారులు నూజవీడు

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహాదరు జమీందారుగారు, నూజవీడు

3 రాజా వాశిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరు మన్నె సుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామలింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మఖ్తాదారు చోల్లేరు

8 అనంతరెడ్డి దేశముఖుగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు-క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 అన్నమురాజు సుబ్బారావుగారునందూరు

7 నందూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నందూరు

8 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

19 మెదకు శేషారావు దేశముఖుగారు నల్లబల్లి

10 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము

11 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

12 హేజిబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

13 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

# అభినవసరస్వతి

సంపుట 7. | జానపాడు<br>రాక్షస సం॥ జ్యేష్ఠమాసము | సంచిక 6.


## కృతివిమర్శము

భోగేశ్వరమహాత్మ్యము:—ఇది యొక క్షేత్రముయొక్క మహత్త్వ. ఇందు శ్రీశైలమహిమకూడఁ జక్కఁగ వర్ణింపఁబడియున్నది. కవిత్వము కడు రసవంతమై ముద్దులు మూటగట్టుచున్నయది. కల్పనలు మెండు. ఈగ్రంథము చేతఁబట్టినఁ జాదకుల కొకపద్యమేని వదల మదిజనింపదు. గ్రంథకర్త సంగదోషమునకుఁ గర్తృత్వమును వహించిన శ్రీ మల్లంపల్లి మల్లిఖార్జునశాస్త్రిగారు. కనుకనే యీగ్రంథ మింత మంచిపాకములో దిగినది. దీని వెల 0-8-0, వలయువారు బందరుతాలూకా పెడన సింగరాజా బసవరాజా గారి పేర వ్రాసికొనవలెను.

ఉత్తరరామచరితము:—ఇది యేడంకముల నాటకము. భవభూతి రచితమునకు దెలుఁగుఁ కవిత్వము హృద్యమై యలరారుచున్నయది. గ్రంథకర్త ద్వివేదుల బ్రహ్మానంద శాస్త్రిగారు. వీరిదికాక యనేకగ్రంథముల రచియించియున్నవారు. దీనివెల 0-7-0 వలయువారు గోదావరిజిల్లా తునికి గ్రంథకర్తపేర వ్రాసికొనవలెను.

గోష్పీవన మాహాత్మ్యము —ఇది బాపట్ల తాలూకాలోని పొన్నూరుయొక్క స్థలపురాణము బ్రహ్మవైవర్తపురాణస్థము. ఇయ్యది శిధిలతాళపత్రములందుండఁ బొన్నూరు భావనారాయణదేవాలయ ధర్మకర్తయగు రాజా వాసిరెడ్డి వెంకటలక్ష్మీనరసమాంబా రాజీబహద్దరు వారి సుల్తాను గారి తమ్ములును బరీక్షితము నరసారావుపేట సబ్ మేజస్ట్రేటులును నగు చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణప్రసాదము బి-యే గారి ప్రేరణచే గుంటూరుటవున్ హైస్కూలు సంస్కృతోపాధ్యాయులగు శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు లేఖకప్రమాదాది జనితదోషంబులు లేకుండునటుల సంస్కరించి తెనుఁగున సరియైన ట్రాన్సలేషన్ చేసిరి. ఈగోష్పీవనమాహాత్మ్యము సంస్కృతమున 10 యధ్యాయములు నాచార్యులుగారు తెలుఁగున 5 ఆశ్వాసములుగా రచించిరి

అనేక శతావధానము లొనరించి తమకవిత్వ మనేకస్థలములఁ బ్రకటించిన యాచార్యులుగారి కవిత్వము కడుఁరసవంతము లోకోక్తిభూయిష్ఠము నిర్దుష్టము నై విద్వచ్ఛ్లాఘ్య మగుచున్నయది ఇందు శ్రీగోవిందుచరిత్రి మతిమనోహరముగ వర్ణింపబడినది సామీప్యమందలి పౌనన్నాశము యొక్కయుఁ తుంగభద్రయొక్కయు మహాత్త్వము నెఱుంగని జనుల కిది యంజ్ఞప్రియము. ఇందు మొదటి 10 అధ్యాయముల సంస్కృతగ్రంథమును బిదప 5 ఆశ్వాసముల యాంధ్రగ్రంథమును నున్నయది వెల 0-10-0 లు

సరోజిని:—ఇది 5 అంకముల యొక నాటకము కవిత్వము మృదుమధుర శైలి లోనుండియున్నది. కథ కడు శ్రావ్యము దీనిని గీర్తిశేషులగు తురగా వెంకటచలము బి యే, గారు రచించిరి. పై గోష్ఠీవనమహాత్మ్యమునఁగూడ మొదటి 18 పద్యముల తరువాత 50 పద్యము లేతద్గ్రంథకర్తయగు వెంకటాచలముగారు రచించిరి. ఈగ్రంథద్వయమునకును బ్రోత్సాహకులు చిరుమామిళ్ళ లక్ష్మీనారాయణ ప్రసాదముగారే యైయున్నారు వీరు విద్వత్పక్షపాతులును విద్యాభిమానులును సజ్జనులును బరోపకారపారీణులును ధర్మమార్గగతులును నై నిత్యాద్యుత్తమకార్యముల ముందంజవేయుచుందురు. సరోజినీనాటకకర్తలగు వెంకటాచలముగారినే వీరు ప్రోత్సహింప గోష్ఠీవనమహాత్మ్యము మొదలిడి 50 పద్యములు రచించునంతకే కీర్తిశేషులయినఁ దరువాత శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారిచేఁ దద్గ్రంథపరిసమాప్తిం జేయించి ప్రచురపఱిపించిరి. దీని వెల 0-12-0 లు

కృష్ణానదీదండకము. భగవన్మహిమతారావళి:— ఈ రెండు శతావధానులగు నేమూరు నరిశింహశాస్త్రిలుగారిచె రచింపఁబడినవి పారాయణోపయుక్తములు గ్రంథకర్త వ్యాకరణపండితుఁడు నిపుణసాహితీమంతుఁడు ఆయనగీర్వాణవాణీనైపుణం జూపఁదారావళిలోనియొక్క శ్లోకము నుదాహరింతుము.

శ్లో॥ బరీభర్షి స్వామిన్! జగదఖిలమానందభరితో
వరీవర్తి వ్యాప్తస్సతతమభితస్స్వానవపుషా
జరీహర్షి స్వర్గం పునరపకృపాంతేశరహితః
చరీకర్షి శ్రేయోయదితవదయాచిత్రచరిత!॥

ఈగ్రంథము వలయువారు బెజవాడనుఁ జిఁచినాడ వెంకటరత్నశాస్త్రి పేర అర్ధణాబిళ్ళపఁపిన నచితముగఁ బంపఁబడును.

క॥ శుభలగ్నంబునమఘవ। న్నిభుఁడగుభూజాని రాజనికరము మంత్రు
ల్ప్రభువులు నల్దిక్కులరా। విభవోన్నతిగేహమునఁబ్రవేశించెదగన్॥
వ॥ ఇట్లుప్రవేశించి తల్లియగు సునందా సుందరీరత్నంబునకు
నమస్కరించి దీవనలుగైకొని సకలజనంబులఁ దమతమనికేతనంబుల
కనిచి యిష్టవినోదంబులనుండె॥ 123

వసంతఋతువర్ణన.

క॥ అంత సమాగతమయ్యె వ। సంతము సంతతశకుంతసంతానరవా
క్రాంతదిగంత మనంతల। తాంతనిరంతరలసద్వనాంతంబగుచున్॥
తే॥ వనరమాదేవి జీవితస్వామియైన
చైత్రుఁడేతేర మలినవస్త్రములుదిగిచి
తలపఁ జెంగావిచీరెలుదాల్చెననఁగ
జీర్ణపర్ణంబు(లెడలి) లేఁజిగురువ్రెడమె॥ 128
తే॥ మానకవనులఁగొమ్మలు మధురసాప్తిఁ
బల్లవసురాగసంపత్తిబరఁగెనౌర!
మానకవనులఁగొమ్మలు మధురసాప్తిఁ
బల్లవసురాగసంపత్తిఁ బరఁగుటరుదె॥ 129
క॥ కోరకములొప్పెఁ జైత్ర శ్రీరామునకింపు(తోడఁ)జెలువొందఁ(గనా)
క్షీరనిధిభూరిమౌక్తిక। హారంబులుకానుకిచ్చెనన నవ్వేళన్॥ 130
శా॥ కాంతోద్యద్గతి మాధవాగమ వయోగాంభీర్యమొప్పారఁగాఁ
గాంతాచేందిరనూత్నపుష్పవతియై కన్పట్టెనన్ విస్ఫుర
త్సంతోషప్రథితాళిసినివహాసఝ్ఝంకారనాదార్భటిన్
గాంతామంగళగానముల్ చెలఁగె రంగత్కౌతుకావాప్తిమై॥ 131
తే॥ రూఢి శిశిరర్తువనునమిత్రుండు సిరులు
చూఱఁబుచ్చిన నవలతాసుందరులకుఁ
జైత్రనృపుఁడిచ్చురత్నభూషణములనఁగ
ఫలములొప్పారె లలి వనస్థలములందు॥ 132

తే॥ తనరుసద్ద్విజచయము మాధవుని సేవ
నిష్టఫలములనొంది సంతృప్తిమీఱె
తనరుసద్ద్విజచయము మాధవుని సేవ
నిష్టఫలముల నొందుట కేమియరుదు॥ 133

ఉ॥ మారుజయప్రదేశములొ మన్మథుమోహనబాణశాలలో
వారిధికన్యకాసుతుని వైభవసీమలొ కంతుకేళికా
గారములో వసంతసఖు గాననివాసములో యనంగ శృం
గారగతిం జెలంగె సహకారముల త్తతి సౌఖ్యదంబులై॥ 134

చ॥ హరిహయధర్మవిక్రమవిహారము పెంపువహించె జాతిసం
కర మొగి(లేక యే)సుఖము ఖద్విజరాజికిఁగల్గె నుల్లస
ద్గురువిభ(వుండు) మాధవుఁ డకుంఠమహావనమండలంబునన్
గరము పలాశభేదన మొనర్చి నిజాభ్యుదయంబు దెల్పినన్॥ 135

సీ॥ చికిలికెంపులఁబోలు చిగురుటాకులడాలు
హాలహాలానలజ్వాలగాఁగఁ
బరువమైతనరారు విరులగుత్తులసౌరు
పరిపూర్ణ చంద్రబింబంబుగాఁగ
సొగసైనమవ్వంపు సోగతీఁగెలగుంపు
లిందిరాసుందరి హేలగాఁగ
మధురసంపదనింపు మకరందముల పెంపు
రమణీయమగు సుధారసముగాఁగ
మాధవాగమమందరత్వొన్మధరేంద్ర
మథనపృథుయత్నమునఁ జాలమహితమగుచు
నఖిలభువనోన్నతస్థితి నమరుచున్న
మంజువనరాశివనరాశిమధ్య మొప్పె॥ 136

సీ॥ చూతముల్ పాంథహృద్ఘాతముల్ పల్లవ
జాతముల్ మిగుల రంజకములయ్యె

తుంగముల్ వాసనారంగముల్ మోహనా
భంగముల్ వైభవాస్పదములయ్యె
కుందముల్ మాధవాళిందముల్ విగళన్మ
రందముల్ మిగులఁగ నందగించె
వకుళముల్ సందీప్తముకుళముల్ మన్మథా
స్త్రకుళముల్ మిక్కిలిరహివహించె
సమదసంభ్రమసంభ్రమచ్చారుచంచ
రీకదళకీరికాశారికాకదంబ
ముఖరముఖరితదశదిశాముఖములగుచు
వరుసఁగన్పట్టు కాంతారవసతులందు ॥ 137

ఉ॥ పారములేని క్రొవ్విరులపంక్తులు పాపటచేర్లుగాఁగ భృం
గీరవ మొప్పుపాటలుగఁ గెందలిరాకులు జాతికెంపురా
యారతిపళ్ళెరంబులుగ నాశుగకంపితముల్ లసద్గతుల్
గా రహిఁజెందెఁ జైత్రనృపుకట్టెదురం బ్రతతీసతీతతుల్ ॥ 138

సీ॥ పాటీరనగశిరఃకోటీతటపటీర
వాటీస్థలమున భవమ్ముఁగాంచి
యేలాలతాళిందహేలాగతపుళింద
బాలాకుచసుగంధపాళి నాని
పారసకల్హారసారసాకరనీర
సారసీకరములజలకమాడి
హృద్యబంభరగీతవిద్యానవద్యాత
తోద్యానమకరంద నుగ్గుద్రావి
రంజితనికుంజపుంజాభిరామ కోమ
లోల్లసితమల్లికావల్లి కోసుచారు
దోలికామాలికల హాళి లాలియూఁగి
యలరె నామని గంధవహార్భకుండు ॥ 139

చ॥ సుమముల ద్రచ్చిద్రచ్చి పరిశుద్ధగళన్మకరందబిందుబృం
దముచవి మెచ్చిమెచ్చి(సురితాం)తలతాంతసుకాంతపుంజవు
న్గములను జొచ్చిచొచ్చి వికసద్ఘనకాంచనదర్శనమ్ముచే
గములొగివిచ్చివిచ్చి కనఁగాఁదగె షట్పదపంక్తు లావనిన్॥ 140

ఉ॥ సాలము లెక్కి లేఁజిగురు సంతస మొప్పఁగ మెక్కి సన్నపుర్
గాలికి స్రుక్కి మోహములఁ గాంతలకౌఁగిళులందుఁ జిక్కి హే
రాళసుఖాప్తి నిక్కి సుకరస్థితి భేదముదక్కి వింతయౌ
ఖేలనలీలఁ జిక్కి చెలఁగెన్ మదకోకిలపంక్తు లావనిన్॥ 141

చ॥ ఫలములఁ గోరికోరి పరిపక్వములౌనవి కాంచికాంచి త
త్ఫలరసమానియాని సురతక్రియలన్ లలి మీఱిమీఱి యిం
పలరఁగజొక్కిచొక్కి మధురాయతభాషల మించిమించి తా
ర్వెలసితభంగి నొప్పెఁ బృథివీస్థలి నప్పుడు కీరదంపతుల్॥ 142

సీ॥ బింబముల్ గని చంద్రబింబాననల తావి
చెంగావిపెదవులచెలువు లెన్ని
సారంగములఁగాంచి సారంగయానల
విమలవీక్షణవిలాసములుపొగడి
పున్నాగములఁగాంచి పున్నాగవేణుల
నాభివిశేషవర్ణనలు చేసి
కాంచనమ్ములఁగాంచి కాంచనాంగుల తనూ
లతలబంధురగతులు మెచ్చి
సరసులా చైత్రవేళల సరసలీల
లతిశ(యింపంగఁ)జొక్కిగతులరరతుల
నతులవాసంతికా నికుంజాంతరముల
గలసిమెలసిరి రహిఁ వనస్థలులయందు॥ 143

వ॥ శ్రీఖండభూభృత్పరిసరస్థలచర ద్భిల్లపల్లవాధరీజన కాఠిన్యప
యోధరపరిలిప్త కురంగనాభికాసౌరభసంకలితాగమనశమనహారిన్మరు

త్వరంపరాపరికంపితకేసరకుసుమకేసర ధూళిధూసరితదశదిశాముఖంబులవలనను, భూదేవతాజనంబులకు భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయసంపన్నంబులగు శాల్యోదనంబులొసంగి తాంబూలంబులిచ్చి ప్రసూనాభరణాంబరధారులంజేసి ఘనసారగంధసారపంకంబులలంది తాళవృంతంబులవిసరి చరణ(రక్షా)దులొసంగి వైశాఖపూజలొనరించు సుకృతాత్ములవలనను, లతాంతకుంతమండలీకృతోద్దండపుండ్రకోదండవిముక్తపుష్పకాండప్రచండవేదనాదోధూయమానమానసంబుల నాహారంబులు వనవిహారంబులు దూరంబుసేసి మోహావికారంబులఁబొరలు రాజకుమారులవలనను, అప్పాలుగుప్పాదొర యొప్పగుల్కు చొప్పుదెప్పు కప్పగల గొప్పవిప్పుకొప్పులముడుచు పువ్వులు నవ్వులు దవ్వులుచేసియుఁ బాటలాటలుమాటలుడిగియు సాటిలేనిపుష్పవాటుల నందంబగుచోటులందిరుగుచుఁ గలికిరాచిలుకల పలుకులు చెవులకు ములుకులక్రియం దాకిన సొలయుచు బహుభంగులంగన్పట్టు రాజన్యకన్యకాకదంబంబులవలనను అందమ్ములుగల కెందమ్ముల మరందమ్ముల కై నిలుచుమిళిందమ్ములుగల పొందమ్మికొలంకుల కెలంకులఁ దావులుగుప్పు పూఁదీవపొదరిండ్ల జెన్నుగలకన్నమావులతావులఁ జెంగలువబావులక్రేవల నొప్పుమిగిలి గొప్పలగుకురువేరుచప్పరమ్ములయిమ్ముల బహువిధసరసవిలాసకేళీపరతంత్రములై చూపట్టుమిథునంబులవలనను మనోభిరామంబగు నాసమయంబున॥ 144

—• గంగ శంతనురాకకెదురుచూచుచు విరహవేదనపడుట •—

క॥ గంగాకురంగవీక్షణ। శృంగారవతీలలామ సీతాంశుముఖుల్
పొంగుచుఁగొలువఁగ హిమవ। ద్రంగత్పరిసరవనాంతరంబున వేడ్కన్
వ॥ నిలిచి యారాజకుమారరమాకుమారురాకకై దినంబులు గడుపుచు॥ 146

కం॥ కుసుమాకరంబు రాకయుఁ
గుసుమాయుధుఁ డస్త్రవితతిఁగురియుటయు లస

త్కుసుమాయుధనిభుఁడగుపతి
వెసరాకటఁదడయుటయు వివేకించిమదిన్ ॥ 147

వ॥ ఇట్లువితర్కించె॥ 148

మ॥ "కలకంఠార్భటు లుల్లసిల్లె మధువిద్గంభీరఝుంకారసం
కులకోలాహలనాదముల్ చెలఁగె ద్రుమకుల్ పత్రపుష్పాళిచే
ఫలసంఘాతముతోడనొప్పెసఁగె శుంభద్వైభవోపేతలై
చెలువల్ కాంతులఁగూడు వేళ లివె వచ్చెన్ జైత్రలీలాగతిన్ ॥ 149

కం॥ పదనిడిన పూవుటమ్ములు
చెదరనివాచపులునింపుసింగిణినిడి తా
మదనుఁడుముదమొదవఁగ విది
యదనని పాంథులను వేఁటలాడంజొచ్చెన్ ॥ 150

సీ॥ సరససల్లాపసంజనితహర్షస్ఫూర్తిఁ
గీరదంపతులౌర! మీఱఁజొచ్చె
ఈడుజోడుగఁగూడి వేడుకలుప్పొంగి
పికదంపతులు (హృదు) త్సుకతనొందె
సురతసంగతులచే శోభిల్లిమదభృంగ
జాయాపతులు చాలసంభ్రమించె
నిరుపమమోహాప్తి నిండారుకౌఁగిళ్ల
రాయంచమిధునముల్ రహివహించె

ఇట్టిమధువేళనొంటినె నెట్టులుందు
నక్కటా! శంతనుండిటకరుగుదెంచు
ననుచునేనెన్ని దినములో యతనికెదురు
చూడఁజూడంగ వయసెల్లఁజూఱఁబోయె॥ 151

కం॥ సగమయ్యె ధైర్యమియ్యెడ
జగతీతలనాథతిలకు చందురుకెనయై

సొగసైన ముద్దులేనగు
మొగమైననుజూడనైతి మోహముదీరన్ ॥ 152

ఉ॥ ఏల ప్రదీపభూపుకడకేగితి నేగిన నన్నుఁ జూచితా
నేల "సుతున్ వరింపుమిట కెన్నఁగ నామనివచ్చు" నంచు సం
శీలతఁ బల్కె, నంతటనె చెప్పఁగరానటువంటి ప్రేమనా
కేలజనించె, వాఁడిటకదేటికివచ్చుటమానె నక్కటా! 153

చం॥ రమణ మృగవ్యతత్పరత రాజశిఖామణియైనయట్టియా
హిమకరవంశవార్ధిశశి యెన్నటికిచ్చటికేగుదెంచునో
తమకము హెచ్చఁజొచ్చె నిఁక దారుణకీరమయూరశారికా
ప్రముఖమనోజసైన్యముల బాధకు నేగతినోర్తు దైవమా! 154

ఉ॥ చెక్కిటఁ జెక్కుఁ జేర్చి జిగిసిబ్బెపుగుబ్బ లురస్థలంబునన్
గ్రుక్కనమోపి గాఢముగఁ గౌఁగిట బిగ్గరఁబట్టి కాంతు నం
జక్కరమోవితేనియలు సారెకు నామనసారఁ గ్రోలి పెం
పెక్కెడుభాగ్యలక్ష్మి యిఁక నెన్నడుగల్గునొ నాకు దైవమా! 155

కం॥ భూకాంతుఁ డెన్నిచూచిన
నేకచ్ఛత్రాధిపుండు హితమతి నాహా!
యేకరణిఁ గల్గునాతని
తోఁగూటమి నాకు వలపు తుందుడుకెడలన్ ॥ 156

ఉ॥ ఎన్నడు వేటమార్గమున నిందుకులాగ్రణి యేగుదెంచు, న
న్నెన్నడు వైభవంబొదవ నిష్టముగాఁదగఁ బెండ్లియాడు నే
నెన్నడు భర్తతోనగుచు నింపెసలారఁగఁ గౌఁగలింతు నా
కెన్నడు సౌఖ్యవారినిధి నేర్పడఁ దేలఁగఁగల్గు నక్కటా! 157

ఉ॥ అక్కట! యేమిచేతు, విరహానలవార్ధికి మేరయేది, నే
నెక్కడనుంతునీవలపు నీగతి దైవమదేల వ్రాసె నా
చక్కరవింటిబోయ తనసాధన వేగమ చూపఁజొచ్చెన
మ్మక్క యిఁకెట్టుతాళుదును, హా! మది పాయదు తాప ముగ్రమై

చ॥ తరమగునమ్మ మోహపరితాపముమాన్పఁగ నమ్మచెల్ల! యే
తెఱఁగున వాఁడు వశ్యుఁడగుఁ దెల్పఁగ రానిమనోజబాధ కే
వెఱవుననోర్తు నన్నుఁ బృథివీవరుఁగూర్చెడి ప్రాణబంధులె
వ్వరుగల రయ్యయో! యిఁక నవారణలీల నుపాయమెట్లొకో,,

వ॥ అనిపలికి 160

సీ॥ కలకంఠముల కుహూకారముల్ వినకుండ
నంగుష్ఠములు వీనులందుఁ జొనిపి
తళుకొత్తు లేమావితలిరులు గనకుండఁ
దగఁ దర్జనుల నేత్రయుగము మూసి
బంధురసుమబృంద గంధముల్ జొరకుండ
ఘ్రాణయుగ్మ మనామికలను బట్టి
ఘనతరస్థితిదోఁపఁ దనయున్న చొప్పు పెం
పొనరుచుండెడి సుఖాసనము గాఁగఁ
గలిగి తలఁపించె నప్పు డక్కాంత కాంతు
సద్గురువరోపదిష్టితసరణి ధరణి
ధవపరబ్రహ్మసౌఖ్యానుభవముకొఱకుఁ
దారకస్థిరషణ్ముఖి దాల్చెననఁగ॥ 161

కం॥ అంతట లతాంతకుంతుం
డెంతయుసంతోష మాత్మ నిగురొత్త మహా
నంతశకుంతకులారవ
సంతతియనుగమనభేరి జరిపించెఁ దగన్॥

సీ॥ మెఱుఁగైన పచ్చగన్నెరుదండ(సిగను) మీఁ
ఱఁగఁజుట్టి కల్వతురాయిఁ బెట్టి
చాయమొల్లలమేల్కుళాయి పొం(గుచుఁదొడ్గి)
తలిరాకుజరబాబు దట్టిగట్టి
కురువేరు (పగడంపు) బిరుదుగాబిగియించి
రంగుగేదంగి సరంగమర్చి

శా॥ వాణీస్కందగణేశవహ్నిశశభృద్వాయ్వర్కముఖ్యామర
శ్రేణింగొల్చి గురుఁ భజించి(యు) సమస్తేమాంగమూర్ధస్థితిఁ
నాణెంబొప్ప సుఖాసనస్థుఁడయి యానందంబుసంధిల్లఁగాఁ
బ్రాణాయామముఁజేయఁగావలయు శుంభద్జ్ఞానసంరూఢుఁడై ॥ 114

తే॥ ప్రాఙ్ము(ఖమున నొ మఱి యుదగ్వదనమున నో
నాసతుదఁ జంద్రబింబంబునఁ సబిందు
వై యొసంగి స్రవించు తురీయమైన
యమృత మీాక్షణచేయుచు నక్షియుగిని)॥ 115

సీ॥ ఇడ(చేతఁ)బవనంబు విడువక పూరించి
యుదరంబులో నిల్పి యుదరమందు
జ్వాలావళీశతోజ్జ్వలవహ్నిరూపంబు
ధ్యానంబుగావించి మానియగుచు
వరబిందునాదయు గ్వహ్నిబీజము లోనఁ
జింతించి పింగళచేత రేచ
కముచేసి మెల్లనె క్రమముగాఁ బింగళఁ
బూరించి(యగ్నిదా పూర్వ)బీజ
మునుదలంచుచు నిడను మెల్లన వి రేచ
కంబుగావింపుచుఁ ద్రిచతుష్కంబులైన
హాయనములైన నెలలైన నధికనిష్ఠఁ
జేయవలెఁ గుంభకంబిట్లు సిద్ధికొఱకు॥ 116

వ॥ ఇట్లు త్రిసంధ్య(లయందు)ను షట్పర్యాయంబు(ల)తిరహా
స్యంబుగా నిత్యంబొనర్ప స్థూలసూక్ష్మోపలక్షితంబైన నాడికాశుద్ధి
సిద్ధించు నంతట॥ 117

ఉ॥ దేహము చుల్కనౌ,విమలదీప్తివహించును జాఠరాగ్ని,యు
త్సాహముమీాఱునాదము ప్రసన్నమగుం,దగ నిట్టిచిహ్నముల్

మోహవిహీనుఁడై కను చు మోదముతో నిదిమాని వీతసం
దేహనిజాత్మసిద్ధిని విధింపఁదగుఁ శివయోగయుక్తి చే॥ 118
మ॥ అరయంగాఁ బరిశుద్ధమై యమితమై యానందమై నిత్యమై
పరమంబైనచిదాత్మ తన్నెఱుఁగమిఁ భాసిల్లు మాలిన్యమై
పరమజ్ఞానరతిందలం(ప మరలం) బ్రఖ్యాతమై శుద్ధమై
పరఁగుఁ జ్ఞానదీజలంబులను శుంభల్లీల నజ్ఞానదు
స్తరణోద్యన్మలపిండముంగడుగువాతం డౌను ముక్తుండిలన్॥ 119
తే॥ (తానునిష్కర్ముఁడైనను దజ్జ్ఞజనుఁడు
అజ్ఞలౌకర్మసంగుల కదియొ)మెపుడు
చేయుఁడనుచును హితబోధ సేయవలయు
(బుద్ధిభేదముజనియింపఁబోల దరయ") 120

* యమము *

తే॥ ఈశుఁ డిట్లనిపల్క దేవేజ్యుతోడ
"మహిత సాష్టాంగమగు యోగమహిమనీకుఁ
దెలియఁజెప్పెదవినుము సందేహమెడలి
శ్రద్ధ శాంతియు దాంతియుఁ జాలఁగలిగి॥ 121

వ॥ యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణాధ్యానస
మా(ధులచేయోగంబష్టాంగంబు)అందు యమం బహింసాసత్యాస్తేయ
బ్రహ్మచర్యదయార్జవక్షమాధృతిమితాహారశౌచంబులనం బదివిధంబు
లయ్యె, అవియెట్టివనిన॥ 122

క॥ శ్రుతికథితహింసదక్కఁగ
మతివాక్కనఁ గర్మములను మానినహింసా
రతి యదియెయగు నహింసా
స్థితి (యరయఁగ) యోగసిద్ధిఁజెందును దీనన్॥ 123
తే॥ "సకలభూతంబులందును సమముగాఁగ
నాత్మగలదంచుఁదెలియుట యగునహింస"

యనుచు వేదాంతవిదులైన యనఘమతులు
పలికిరాగమజాలంబు లరసిచూచి॥ 124

క॥ కన్నదివిన్నదియున్నది
యున్నట్లన పలుకుటయును నోరునకు సత్యా
పన్న తదౌరయఁగ శుభ కా
ర్యోన్నతిగల కల్లమాటయును సత్యమగుఁ॥ 125

తే॥ సచ్చిదానందరూపమై (జగతి వెలయు)
బ్రహ్మ మొక్కటె(సత్య)మైపరఁగు నన్య
మైనదెల్ల నసత్యమం చాత్మఁగనుట
(యగునుసత్యంబట)నిరి వేదాంతవిదులు॥ 126

క॥ పరకీయ హేమమహా క్తిక।వరరత్న తృణాంబరాదివస్తువులెల్లన్
గరణత్రయములవిడుచుట।పరమా స్తేయంబటండ్రుపరమమునీంద్రుల్॥

తే॥ ఆత్మయందునఁ దగఁ బరమాత్మరూప
మాజగద్వ్యవహారంబు లర్పణముగఁ
జేసి తా స్వీయ భావంబుఁ బాసె నేని
అదిసదస్తేయమనిరి వేదాంతవిదులు 128

కం॥ కరణత్రయంబుచేతను
బరభామలవిడిచి నైజభామల ఋతువం
దరయఁగఁగూడుటె(యవ్యోడి)
వరతరమగుబ్రహ్మచర్యవర్తన ధరణిన్॥ 129

వ॥ బ్రహ్మభావంబునమనంబుచరించుటే బ్రహ్మచర్యంబని వేదాంత
విదులు పలుకుదురు. 130

కం॥ తనవలెను సర్వభూతము
లను మానసవాక్ప్రచారలక్షణములచే
ననుకంపగలిగిచూచుటె
వినుతస్థితి దయయటండ్రు వేదాంతవిదుల్॥ 131

తే॥ (పుత్రమిత్రకళత్రముల్ శత్రువితతు
లాత్మ నొకరూపమునఁజూచు చనవరతము)
కపటమెఱుఁగని ఋజుమార్గకలనగలుగ
నార్జవంబంద్రుమునులిది యాదరమున॥ 132
తే॥ శత్రుభాధయు రోగాదిగాత్రపీడ
గలుగ మానసవాక్కాయకరణములను
జలన మొందనిసద్బుద్ధిక్షమయటంచుఁ
బలికిరెంతయు బ్రహ్మవిత్ప్రవరులిలను॥ 133
తే॥ సారవిజ్ఞానవృత్తి సంసారమందు
(సమరు)ధనధాన్యబంధుమిత్రాదులకును
హానిగల్గినఁ జలనంబులేనిచిత్త
వృత్తి ధృతియంచుఁబలికిరి వేదవిదులు॥ 134
తే॥ అన్యుఁడనుగాను బరమాత్మునగుదునేను
నిక్కముగనంచు నీబుద్ధి నిలిచెనేని
యిది యతిశ్రేష్ఠ(మైనట్టి) ధృతియటంద్రు
వేదవేదాంతవిజ్ఞానవేదులెపుడు 135
తే॥ అల్పమృష్టాశనంబుల నాత్మయోగ
విఘ్నమగుటను (నయోగ్యవిధికిఁదగిన)
యశన మాత్మహితంబుగా ననుభవింప
నది మితాశనమనిపల్కి రార్యజనులు 136
కం॥ ఘనముగ మృజ్జలములఁ దన
తనువువిశుద్ధంబుసేయుతద్విధ బాహ్యం
బునశౌచమనిరి తద్జ్ఞులు
మననమె లోశుచితయనిరి మాన్యులుధరణిన్ 137
ఉ॥ నేనతిశుద్ధమూర్తినని నిశ్చయమొందుటశౌచమంచు వి
జ్ఞానులువల్కి రీతను వశౌచము దేహి వినిర్మలుండయా

ఘ్రానిక దేహ దేహులకుఁ బొల్పగునంతర మెంచిచూచి వి
జ్ఞానులు శౌచమెవ్వనికినల్పుదు రజ్ఞులువోలె నిచ్చలున్ 138
తే॥ జ్ఞానశౌచంబుమాని యజ్ఞానకలన
బాహ్యశౌచంబొనర్చు నేపామరుండు
అతఁడు హేమంబువిడనాడి యల్పమైన
యినుముగైకొనువాఁడు దేవేజ్య! తలఁప 139
కం॥ జ్ఞానామృత(శుద్ధు)ండై
మానక కృతకృత్యుఁడగుచుమను యోగికి నెం
దైనను కర్తవ్యములే
దైనను గలదేని ముక్తుఁడగునె యతండున్ 140
కం॥ లోకంబులఁ కర్తవ్యం
బేకాలం బాత్మవిదుల కెయ్యది,పుణ్య
శ్లోకులుజీవన్ముక్తులు
నాకృతులని శ్రుతులువలుకు నమలవిచారా! 141
తే॥ అట్టుకావున సర్వప్రయత్నములను
వేదజంబైనవిజ్ఞానవిధమువలన
(క్షమ)నహింసాదిసాధ(నగణము చేత)
నెఱుఁ(గుమానశ్వరంబౌచువరలునాత్మ) 142

—నియమము—

తే॥ ఇంకనియమప్రభేదంబు లెనఁగుఁబదియు
తపము సంతోష మాస్తిక్య దానములును
స్వేశపూజయు వేదాంతమెపుడువినుట
లజ్జ మతి జప వ్రతములులలితగతులు 143
తే॥ ఆగమోదితకృచ్ఛ్ర చాంద్రాయణముల
నంగకార్శ్యంబుతపమగు,నదియుఁగాక
యెవ్వఁడనునేను ముక్తి(నాకెట్టులబ్బు

ఐతిసంసారిదే నన్నదియుఁ దపము) 144

క॥ అరయయదృచ్ఛా(వశమున)
దొరకిన యావస్తుతతికిఁ దుష్టివహింపన్
నిరతముసంతోషంబని
వరమునిజాలంబులెపుడు వర్ణిం(చుని)ల్ 145

వ॥ బ్రహ్మాదిలోక (పర్యంతంబైనవిరక్తియుఁ బరాత్మయందలి
రక్తియు) సంతోషంబనంబడు, 146

క॥ ఏమొడస(చ్ఛాస్త్రో)వళు
లాయతమతిననమ్మటదియ యాస్తిక్యమగున్
న్యాయార్జితవిత్తము ని
ర్మాయాస్థితి బుధులకొసఁగ మహి దానమగున్ 147

తే॥ అన్న ముదకంబు ధనము ధాన్యంబు వైది
కుఁడగువిప్రునకొసఁగఁజొప్పడు (ఫలమ్మ)
అన్యునకునొసఁగుటయందు నరసిచూడ
భస్మమునఁజేయుహోమంబు పగిదిగాదె 148

తే॥ బ్రాహ్మణక్షత్రియోరుసంభవులు భవుసి
హరిని బద్మజుఁ బూజించుటదియె స్వేశ
పూజ,యగుఁగాక తనయిష్టమునకుఁ బాత్ర
మెవ్వఁడద్దేవుఁగొల్చుట యాశపూజ 149

వ॥ మఱియు రాగాదిరహితమనోవృత్తియు నసత్యరహితవా
గ్వృత్తియు హింసా(ది) రహితకాయవృత్తియు నీశ్వరారాధనంబని
యంద్రు, సత్యజ్ఞానానంతపరానందప్రత్యగ్బ్రహ్మబోధనంబైన వేదాంత
శ్రవణంబె ద్విజులకు సిద్ధాంతశ్రవణంబు, విరక్తులైన స్త్రీశూద్రులకుఁ
బురాణశ్రవణంబె సిద్ధాంతశ్రవణంబు, వేదలౌకికమార్గంబులందు జుగు
ప్సితంబులగుకర్మంబులవలనజనించిన మనస్సంకోచంబు లజ్జయనంబడు,
వైదికకార్యంబులయందలి శ్రద్ధ మతియనంబడు, గురూపదిష్టంబై

(నను)తంత్రసంబంధవర్జితంబుగా వేదోక్తప్రకారంబుగాఁ జేయు మంత్రా
ధ్యానంబు జపంబనంబడు, కల్పసూత్రాగమ ధర్మశాస్త్రపురాణేతిహా
(సాను)వర్తనంబును జపంబ, వేదబాహ్యంబులైన కుమతంబులన్నియు
నిష్ఫలంబులు, సమ్యగనుష్ఠితంబగు పరధర్మంబుకంటె విగుణంబయ్యు
ను స్వధర్మంబె శ్రేయస్కరంబగు, పరధర్మంబు భయావహంబగుట
సర్వయత్నంబుల వేదమంత్రంబె జపింపవలయు, ఆజపంబును మానస
వాచకంబుల ద్వివిధంబై యుండు, అందుమానసంబు మననధ్యానభేదం
బున ద్వివిధం(బ)గు, వాచకంబు పాంశూచ్చైర్విధానంబుల ద్వివిధంబ
గు, ఉచ్చైర్జపంబుకంటె నుపాంశువు సహస్రగుణఫలదంబగు, దీనికంటె
మానసంబు సహస్రగుణంబు ఉచ్చైర్జపంబు యథోక్తఫలదంబు, అది
యు నీచులచే వినంబడిన నిష్ఫలంబగు, అట్లాటఁ బ్రసన్నగురుమూర్తి
వలననుపదేశంబయి తదాజ్ఞ ఋషిచ్ఛందోదేవతల ధ్యానంబుచేసి మం
దంబుగా జపింపవలయు, ఇంకవ్రతంబెట్టిదనిన, 150

తే॥ (ఆత్మ ధర్మార్థకామసిద్ధ్యర్థముగను)
చేయు సదుపాయమా వ్రతం బాయుదాత్త
మహిమవినుపింతు సురరాజమంత్రి! వినుము
భుక్తిముక్తిలొసంగు సదుక్తియిదియె॥ 151

ఉ॥ పాశుపతవ్రతంబు సదుపాయము, దీననె భుక్తిముక్తుల
య్యాశుఁడొసంగు, తద్విధ మదెట్టులటన్న నధర్వణాద్యబో
ధాశయమంత్రరాజి భసితంబు శరీరమునిండఁబూయఁగాఁ
బాశుపతవ్రతంబది శుభాస్పదమౌనని రార్యులెంతయున్॥ 152

క॥ కొందఱిది(శిరోవ్రతమ)ని
యందురు, మఱికొందఱిద్ది (యంత్యాశ్రమమహా)
నందురు (నైశ్వర) మని (మఱి) కొందఱు,
శాంభవమటంద్రు కొందఱు ధరణిన్॥ 153

సీ॥ సకలాగమాంతైకసంసిద్ధ మతిపుణ్య
మఘహారి సుజ్ఞాన మార్గహారము
పావనంబైనయీపాశుపతవ్రత
రాజంబుచేత విరాగియగుచుఁ
బాశంబుఁ బశుతయుఁ బాయంగఁజాలని
పాలసుఁజంపినఁ బాపిగాఁడు
నరుఁడని వేదాంతవరరహస్యమునఙ్కు
నియమంబులీపది నిర్జరేంద్ర
వంద్య! విధియుక్తిసల్పు నెవ్వాఁడు వేడ్క
వాఁడు విజ్ఞానయుక్తుఁడై భస్మమనెడి
జ్యోతిగలవాఁడుగానయి ఖ్యాతిమీఱు
ఇంక నాసనభేదంబు నెఱుకపఱతు॥ 154

ఆసనయోగము.

సీ॥ స్వస్తికగోముఖవరపద్మవీర సిం
హాసనభద్ర ముక్తాసనోరు
మాయూరసుఖనామ మహితాసనంబులీ
తొమ్మిదిముఖ్యమై తోఁచుధరణి
జానూరుసంఘులఁ బూనిచిపాదముల్
సమశి (రోగ్రీవుఁడైసరిగ) నిలువ
స్వస్తికాసనమంద్రు, సవ్యదక్షిణగుల్ఫ
యుగళంబు వ్యత్యస్తముగను బృష్ఠ
తలముఁ జేర్చిన గోముఖత్వమువహించు,
ఊరువులయందుఁ బాదంబులొయ్యనిల్పి
కరములను బద్ధ్యగాంగుష్ఠకములవ్యత్య
మంబుగాఁదాల్పనొప్పుఁ బద్మాసనంబు॥ 155
ఐ॥ ఇది సర్వరుజాభయాహారంబగు, మఱియును॥ 156

శ్లో॥ భాస్కరం గణపం విష్ణుం శంభుంచైవ సరస్వతీం। మహాలక్ష్మీం మహాదుర్గాం నిత్యం విప్రస్సమర్చయేత్॥ అని దేవలవచనము, శ్లో॥ ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం। బ్రాహ్మణః పూజయేత్పంచ పంచపూజాపరాయణః॥ అని స్మృత్యర్థకారవచనము. శ్లో॥ విష్ణు శ్శివశ్చ దుర్గాచ సూర్యో గణపతిస్తథా। పంచైతాదేవతాః పూజ్యా యథోపాసనమన్వహం॥ అని స్మృతిసంగ్రహకారవచనము, శ్లో॥ నారాయణం మహాదేవ మాదిత్యం గణనాయకం। శక్తించైవాథ పంచైతా న్నిత్యహం పూజయేద్ద్విజః॥ అని స్మృతిసారకారవచనము. శ్లో॥ ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం। ఏతాన్సంపూజ్యవిధివ ద్బ్రహ్మభూయాయ భవేన్నరః॥ అని స్మృతికౌముదీకారవచనము. ఇత్యాదులు. ఈయుదాహృతవచనములయందు ద్విజబ్రాహ్మణాదిశబ్దములు ప్రయుక్తములగుటచే నీపూజయందు బ్రాహ్మణులకే యధికారము. ఇదియునుంగాక పరాశరస్మృతిలో "నానాపుష్పలతాకీర్ణ"మను శ్లోకపువ్యాఖ్యానమునఁ బరాశరాశ్రమవర్ణనప్రకరణమున "దేవతార్చనలక్షణముగుతపస్సుఫలించె"నని మాధవాచార్యులచేఁ జెప్పఁబడుటవలనఁ బరాశరులచేఁగూడ దేవపూజ యాచరింపఁబడెనని తెలియనయ్యెడిని. ఆపరాశరప్రభృతులు బ్రాహ్మణబ్రువులుకానేరరు. ఈరీతి భగవద్గీత పదునెనిమిదవయధ్యాయమున, శ్లో॥ శమో దమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవచ। జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజ"మని బ్రాహ్మణసహజకర్మలలోఁ దపస్సుకూడఁ బ్రవిష్టమై యున్నది. తపశ్శబ్దముచే సప్తదశాధ్యాయోక్త త్రివిధతపస్సుగ్రహింపఁదగినదని భాష్యమున స్పష్టముగఁ జెప్పఁబడినది. శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవం॥ మొదలగువానిచేఁ ద్రివిధతపస్సులలో దేవపూజకూడఁ బ్రవేశింపఁబడియున్నది. కావున దేవపూజాధికారము బ్రాహ్మణులదేయనుట సిద్ధము. ఈవిషయమైనయధికారాంశము మదీయగ్రంథ ద్వితీయప్రకరణమునఁ జూడనగు. చేయనివారికిఁ బాతకమును జేసినవారికిఁబుణ్యమును బోధించువచనము లనేకము లుండియుండుటం

జేసి "సర్వజనాదరణీయముకాకునికిని జేయనివారికిఁ బ్రత్యవాయాభావమువలెఁ జేసినవారికిఁ బ్రాప్తవ్యార్థముకూడ లే"దనునదికూడ మందీభూతమగుచున్నయది. శ్లో॥ దేవతారాధనంత్యక్త్వా వైశ్వదేవం తథాతిథిం। యోవిప్రో భోజనంకృత్వా నిత్యహోమం తథాత్యజేత్॥ సురాపీ సహి విజ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః మొదలగు నిషేధకవాక్యములును, శ్లో॥ ప్రణమ్యదండవద్భూమౌ నమస్కారేణయోర్చయేత్। సయాంగతిమవాప్నోతి నసాక్రతుశతైరపి మొదలగు ఫలబోధకవచనములును ననేకములుగలవు. దేవపూజాకర్త్రికర్తృపురుషులకుఁ బుణ్యపాపములున్నవో లేవో తరువాత విచారించుదముకాని యనేకప్రమాణోద్ఘోషితమై యనేకదేశీయశిష్టాచారపరంపరాప్రాప్తమైన దేవపూజకనాచారత్వమాపాదించెడివానికిఁ బ్రత్యవాయము కంఠలగ్నమయియే యున్నదని తెలిసికొందురుగాక. తదనంతరగ్రంథము.

పంచాయతనపూజ శిష్టులచే నెందుకనిగ్రహింపఁబడుచున్నదనియనినచోఁ జెప్పఁబడుచున్నది. ఉపనిషత్తులయందు ముక్తిప్రాప్తికి సాధనరూపములగు ద్వాత్రింశద్బ్రహ్మోపాసనలలో నొకటియగు హార్ద్రవిద్యాప్రకరణమున బ్రహ్మలోకద్వారపాలకులగు ప్రాణాదిపంచదేవతల యుపాసనముచేయఁదగినదని విధింపఁబడియున్నది. కావున నం దశక్తులగు మందబుద్ధులకుఁ గ్రమముగాఁ దత్సంపత్తికలుగుటకై బహిర్వేదికపైఁ బంచసంఖ్య నతిక్రమింపకుండ నామభేదముచే దేవతలం బరికల్పించి యర్చించునటుల సంప్రదాయకర్తలచే నేర్పాటుచేయఁబడియుండెను.

అని యుండియున్నది. ఇది స్వకీయగ్రంథమా? పరకీయగ్రంథమునుండి గ్రహించిచేయఁబడిన యనువాదమా? స్వకీయమేయైనఁ బూర్వోత్తరము లనాలోచితములుగాఁ గన్పట్టుచున్నయవి. ఏమన, పూర్వము మూర్తిపూజకులకుఁ బ్రాప్తవ్యార్థమే లేదనియు బాణాదికములు జడములగుటఁ దత్పూజ వ్యర్థమనియు నాక్షేపించి ప్రకృతము క్రమముగాఁ దత్సంపత్తికలుగుటకై బహిర్వేదికపైఁ బంచదేవతాపూజ పరికల్పనచేయఁబడినటుల నొప్పుకొనుచుంటివి. ఇదియునుంగాక పాషాణాదులును జడములేయగుట ద్వారపాలకములగు వానిపూజయందను

గ్రహమెట్లు? బాణాదికములయుపాసనయం దాగ్రహమెట్లు? పరకీయ గ్రంథమునుండి గ్రహించి చేయఁబడిన యనువాదమే యైన ననుక్తార్థము నందైన యాక్షేపణ మత్యనర్హము. ఎవరిట్లు చెప్పిరి? ఉత్తరగ్రంథ మందలి ప్రతినిధిత్వాదిఖండన మెందులకని? ఇదియునుంగాక కల్పన పురుష వ్యాపారాధీనమగుటచే సదృశములుగాని బాణాదికములయందుఁ బ్రాణాదిభావనచేయుటలో నేమిదోషము? ద్వారపాలకములుకాని వానియందు ద్వారపాలకత్వభావనచేసిన ట్లీబాణాదికములందుఁ బ్రాణాదిభావనయుఁ జేయ వీలేయయ్యెడిని. సాదృశ్యముండినసే భావన యుండవలెననునియమ మెయ్యెడం జూడఁబడదు. తనుపరిగ్రంథము.

అవుఁగాక. ప్రాణాదిపంచదేవతల ప్రత్యక్షనామము లుదాహరింపక యాదిత్యాదిపరోక్షదేవతానామము లేలనిరూపింపఁబడెనని యన్నచో వినుఁడు, "పరోక్షప్రియాఇవహిదేవాః ప్రత్యక్షవిద్విషంతః" అను ననవద్యశ్రుతిచే సిద్ధమగు వైదికమర్యాదననుసరించి తదర్థకుశలురచే నిట్టివ్యవస్థ చేయఁబడియున్నది.

అనియున్నది. ఇది మిగులవిచిత్రము. ఎందువల్లనన నవహితుఁడవై వినుము. వేదమం దేభాగమున నెవరికిఁ బరోక్షనామములు చెప్పఁబడునో వారికిఁ బ్రత్యక్షనామములుకూడ నాభాగమందే చెప్పఁబడియుండవలెను. అటుపైని "పరోక్షప్రియాఇవహిదేవాః" మొదలగు వాక్యములును వినఁబడవలె. ప్రకృతమున హార్దవిద్యాప్రకరణపఠితములగు ప్రాణాదిపంచదేవతలకు "ఆదిత్యమంబికాంవిష్ణు" మనుశ్లోకమునఁజెప్పఁబడిన పంచనామములు పరోక్షనామములని యచ్చటఁగాని మఱియొకచోటఁగాని చెప్పఁబడియుండలేదు. అట్లు శ్రుతులయందుఁజెప్పఁబడకున్నను నేనుగల్పింతునంటివా? ఉన్నయర్థమును విడిచిపెట్టుటయు లేనియర్థమును గల్పించుటయు నను దోషద్వయమునుండి యెట్లువిముక్తుఁడవగుదువో తెలియఁబడదు. నేనుజెప్పిన యీయంశములనుగుఱించి సంశయమున్నయెడల సంప్రదాయజ్ఞులగు వైదికులడుగుము తదర్థానభిజ్ఞులగు నవైదికులమర్యాద ననుసరించియే యునట్లువ్రాసితివి. తదర్థకుశలురగు వైదికులచే నిట్లుచెప్పబడి

యుండదు. అందువలన "నీరీతివివక్ష చేయఁబడిన" దనునీపంక్తి కర్థము "ఎందువలనఁ దదర్థానభిజ్ఞులమై యవైదికమార్గానుసారులమైయుంటిమో యందువలన హార్దవిద్యాప్రకరణపఠితములగు ప్రాణాది పంచద్వారపాలకుల కాదిత్యాది పంచశబ్దములు పగోక్షనామములని వివక్ష చేసినా"మని యర్థము చెప్పవలసియుండును. కనుకనే ప్రాణమున కాదిత్యశబ్దము పరోక్షనామమను భ్రాంతిచే నీవుదాహరించిన శ్రుతిద్వయమును నీకుపయోగింపఁజాలదు. "ఆదిత్యోహ వై బాహ్యః ప్రాణః" అనెడిశ్రుతి యజ్ఞోవై విష్ణుః, తేజోవా ఆజ్యం మొదలగుశ్రుతులవలెనే యాదిత్యప్రాణశబ్దముల కేకార్థముం జెప్పెడినిగాని త్వదభిప్రాయానుసారముగ నొకదానికొకటి పరోక్షనామమని చెప్పదు. అట్టినామముల జెప్పెడిశ్రుతులకంటె నీశ్రుతి విజాతీయముగానున్నది. ఈలాగుననే "త్వమంతరిక్షే చరసిసూర్యః, త్వంజ్యోతిషాం జ్యోతిః" అను నీ రెండవ శ్రుతియుఁ బ్రాణమునకు సర్వాత్మత్వము వివక్ష చేయఁదగినదగుటవలన నుపాస్యయగు ప్రాణదేవతకు సర్వాత్మత్వమును జెప్పుచున్నదికాని ప్రాణమునకుఁ బగోక్షనామముం జెప్పుటలేదు. అట్టిసంప్రదాయాజ్ఞానము కొఱకై పరోక్షనామమును బోధించెడి కొన్నిశ్రుతులమాత్ర మిక్రిందినుదాహరించుచున్నవాఁడను. శ్రు॥ తం వా ఏతం దశహూతగ్ం సంతం దశహోతేత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవహి దేవాః సప్తహూతగ్ం సంతం సప్తహోతేత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవహి దేవాః తం వా ఏతం షడ్ఢూతగ్ం సంతం షడ్ఢోతేత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవహి దేవాః. తదిష్టినామిష్టిత్వం, ఏష్టయో హ వై నామ, తా ఇష్టయ ఇత్యాచక్షతే పరోక్షేణ, పగోక్ష.........దేవాః-తదింద్రగ్ం సంతం, ఇంద్ర ఇత్యాచక్షతే పరోక్షేణ, పనోక్ష.....దేవాః ఇత్యాదులు-ఇదియునుంగాక యెవరికేది పరోక్షనామమని శ్రుతులయందుఁ జెప్పఁబడియున్నదో వారికానామము చేతనే లౌకికవైదికవ్యవహారము లుండవలెను. ఎక్కడనేని యొకస్థలమందు వెనుకఁ జెప్పినప్రకారముగాఁ బగోక్షనామమును జెప్పకపోయినను బాధలేదు.

దొక్కఁడు ద్రోహి, వేఱొకరుఁడో గురుపట్టున ద్రోహియౌఁగదా?
నిక్కము వారికిం దెలియునే నవి నన్ను స్పృశింప వర్భకా॥ ౩

ఉ॥ నూఱిమె యుంచినారలఁట? నున్ననికత్తులు ముక్కముక్కలా
తీరునఁ గోతురంట? వెనుదీయ కసత్యములాడువాండ్రయా
దూరసనన్ నిజం బపుడు తోఁపక మానదు, తండ్రినింటికిన్
జేరఁగనీమియున్ గురునిఁ జెట్టఁగఁ గూయుటయున్ బయల్పడున్॥ ౪

చ॥ తెఱచియె పెట్టినారలఁట? తీవ్రదవానలభీకరమ్ములై
నరకములెల్లఁ దండ్రి భవనమ్మున నుండఁగ నీకఁ గ్రోయుసం
కరులను, దేశికున్ దెగడుకట్టిఁడులన్ బడఁద్రోతురంట? యె
వ్వర మట కేఁగమో తెలియువాఁడు పరాత్పరుఁ డొక్కఁడర్భకా॥ ౫

చ॥ నిలిపియు యుంచినారలఁట? నిస్తులశస్త్రపరంపరల్ దురా
త్ములకయి; తండ్రి నిల్వెడలఁద్రొబ్బుట, దేశికుబూతుఁగూతలన్
బలుకుట, నేర్చికొన్న కవిపండితు లయ్యెడ ముఖ్యులంట? త
త్ఫల మనుభూతమౌ నెడలఁ దథ్యము తేలఁగవచ్చునర్భకా॥ ౬

చ॥ కలిపియు యుంచినారలఁట? కల్పడివస్తువు దానిఁ దోడ, నే
యులఁతి పితన్ గృహాంగణమునావలికిన్ బడఁద్రొబ్బునింక నే
యులఁతి గురూత్తమున్ దెగడు నాయిరువాగునకై; తదంబువుల్
తలఁ బడునట్టివేళఁగద? తథ్యము కానఁగవచ్చునర్భకా॥ ౭

చ॥ ఇహమున నెందఱేఁ గల రిద్దఱుదోస మెఱుంగు సాకిరుల్
నహి పరమం; దెవండు చని నారకముం గని వచ్చి చెప్పెఢీ
మహాత్ములు; కిక్కతాన మనమంచియుఁ జెడ్డయు నిందె తేలుటల్
బహుజనసమ్మతం బగు సభాస్థలమందుకుఁ జాలు నర్భకా॥ ౮

ఉ॥ సూన్నృత ముజ్జగించి పెళుచుందనమున్ గడియించి పెర్చుదు
ర్మానమునన్ దురాగతపువ్రాఁతలు వ్రాసినయంత నేమగున్
ధీనిధు లెందు లేరె? గుఱితింపరె నిక్కము నోరు నొక్కరె?
మై నన రే యపాత్రులని పర్దనముల్ వదరంగఁ బోయెనే॥ ౯

శా॥ బహ్వాలాపము లేల కల్లనిజముల్ పాలించువాం డున్నచో
నాహ్వానించి స్వకీయలోకమున నీయాచర్చ గావింపఁడే?
కహ్వాచారులు డాఁగనేర్తురె? యటన్ గాపట్యముల్ నిల్చునే?
జిహ్వాచ్ఛేదము సిద్ధ మాౘటెఁగి భాషింపన్ బ్రయత్నింపుమా॥౧౦

నైవిషయమునకు వ్రాసినపద్యము లెన్నేని గలవు, అందు దిఙ్మాత్ర మిట నుదాహరించితిమి, తక్కినవి ముందు ప్రకటింపఁ బోవు మా "లోకాభిరామాయణమున" జదువఁగలరు, ఇఁకఁ బ్రస్తుత మగు "పురశ్చరణము"నకు సంబంధించిన పద్యములు కొన్ని మాత్ర ముదాహరించి యిది ముగించుచున్నారము.

ఉ॥ పాశుపతమ్ముచేఁ దెగి నభస్థలి నిట్టటు వ్రేలుచున్నన
ట్టాశము సింధురాజుశిర మాపయిఁ బేలద హేతువేమి దు
ర్ధీశబలమ్ముకా! తిరుపతీ? యిదియున్ మఱి వ్రేల దేల? ల
జ్జాశకలప్రచారవివశ మ్మది వీ రటు కారు వీఁటెఁడుల్॥ ౧

ఉ॥ జుట్టుఁగఁదట్టుచున్ దపుడశుద్ధి నుపానహ మూని చేయున
ప్పట్టునఁగూడ మోఁటకు లవాకుచవాకులు గూయమాన ర
స్నట్టులు నాఁడు పాశుపత మట్టులొనర్చినమీఁదఁగూడ నీ
చెట్టులతప్పుఁగూఁతలు నశింపనికారణ మేమి తిర్పతీ॥ ౨

మ॥ దవియాలంబులెఁ జేసి పోవిడిచినన్ ధార్ష్ట్యమ్ములన్ మాన రీ
యనయుల్; వీరలు రక్తబీజులో? లులాయాకారమున్ మున్ను గై
కొని దుశ్చేష్టలొనర్చినట్టి యలరక్షో వీరులో? కాక భూ
జనులం దిట్టెయపత్రపావిరహితుల్ జన్మించుటల్ వింటిమే॥ 3

చ॥ అఁటిముట నేవియో గిలికి యజ్ఞుల వంచన సేయునీధురం
ధరులకునై 'పురశ్చరణ' తాడన మొప్పకయున్నె? తత్పుర
శ్చరణముకల్మిఁ బాశుపతచండిమ మెందు నఖండమై పొరిం
బొరినపలాపధార్ష్ట్యమును బూఁది యొనర్చెడుఁ గాక వీఁకమై॥ ౪

ఉ॥ అంక మొకింతకల్గనిమహాత్ముల మధ్యగ నుంచియో నిరా
తంకుల మధ్య నుంచియొ "శతఘ్నిని" "బాశుపతమ్ముఁ" దెచ్చి స
ర్వాంకషు లైనపండితులభావములన్ దనియింప రాదె? యీ
వెంకెతపంపుఁగూఁతలు బిభీషికలున్ మఱి యేల కాల్పనే॥ ౫

తిరుపతి వెంకటేశ్వరులు.

ఉ॥ కొందఱు దీనికిం గలదు కొండొక హేతువటంచు నేమియో
యందురుకాని నాదుమది కయ్యది నచ్చదు, స్వర్ణకృత్ప్రజా
బృందము మెచ్చుకోలుకయి చెప్పెపెలోఁబడి బ్రాహ్మణాళిచే
నిందితుఁడయ్యె నీబుధుఁడు నిశ్చయమియ్యది యెంచిచూచినన్॥ 79

సీ॥ చేసినాఁడుపకృతి చేతనైనంతలో
బ్రాహ్మణుల్ గాఁజూచు బత్తులకును
వేసినాఁడొకమాట వెలమాటమున్నిభు
"జాతులునాలుగున్ సమము"లనుచు
కోసినాఁడెన్నియోన్ గొప్పవాసారకాయ
"లాఱుశాస్త్రిల్వచ్చు"ననుచుఁదనకు
పోసినాఁడువిషంబు పోయంగఁదగినంత
ఖలధిక్కృత ద్విజకాండమునకు
సంస్తుతించెను గమసాలజనముతనను
సంతసించెనుమున్నిభు చాలమదిని
విశ్రుతంబయ్యె షట్ఛాస్త్రవిత్త్వమవని
ఏమి బ్రాహ్మణ్యబుఁకోఁబని యాయనకిఁక॥ 80

---

నేను గోదావరిజిల్లా యెరుగుదును. విశ్వబ్రాహ్మణులని యిప్పుడు పిల్వబడే వారిని కగణాలనిపిలవరు- మహానుభావులయిన ఋషులసంయోగముచేత చండాలజాతి వాండ్లయినా అరుంధతిశ్వపాకులదోషము పోయినది. వారితపోబలము అట్టిదిగనుక పోగొట్టినది. వ్యాసులు పుట్టుటలోనే ఋషిగాపుట్టినాడు- 7 గడియలలో పుట్టడం పెరగడం సకలవిద్యలు నేర్చుకోవడము జర్గినది. విశ్వబ్రాహ్మణులకు వైదికబ్రాహ్మలకు పంక్తిభోజనములేదు. వైదికులు నియోగులు పెడితే వారుతినరు. విశ్వబ్రాహ్మణుల అన్నము యేజాతివారు తినరు. వీరు యేజాతివారియన్నము తినరు. విశ్వబ్రాహ్మణుల అన్నము ఋంజలువాయించేవాండ్లు తింటారు. లింగబలిజాలు యితరజాతివారి యిండ్లలో భోజనముచేయరు. సాతానులు వైష్ణవులయిండ్లలో భోజనముచేస్తారు జంగాలు లింగధార్లయిండ్లలో భోజనముచేస్తారు. విశ్వబ్రాహ్మణులని పిలువబడేవారు అనాదినుండి బ్రాహ్మణులయిండ్లలో భోజనము చేయుటలేదు. లింగబలిజెల అన్నము సాతానులఅన్నము వారికంటె తక్కువజాతివారు పనిపాటలవాండ్లు అనగా చాకలి కుమ్మర మంగలివగైరావారు తింటారు- విన్నాను సరిగావున్నది......

క॥ తదనంతరసాక్షి జగ। ద్విదితుండగు† చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిల్
పదుగురి ప్రార్థనచేన। య్యాదనున నటువచ్చియుండె నవధానముకై॥

---

*The 30th day of August 1911.*

† చళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ... ... ... బందరు—

బ్రాహ్మణశబ్దము జాతివాచకము- బ్రహ్మజ్ఞానముగలవారిని ఔపచారిక బ్రాహ్మణులంటారు-విశ్వబ్రాహ్మణశబ్దము గ్రంథములలో కనుపడదు-గ్రంథములనగా ప్రామాణికగ్రంథములలో లేదని నాయభిప్రాయము-వ్యాకరణశాస్త్రప్రకారము విశ్వ బ్రాహ్మణ అని వుండదు-వైశ్వబ్రాహ్మణ అని వుండవలెను-విశ్వబ్రహ్మ అనే శబ్దము సృష్టికర్త అయిన చతుర్ముఖబ్రహ్మను చెందదు-గోదావరిజిల్లాలో బంగారుపనిచేసే వారిని కంసాలి అని పిలుస్తారు- కొయ్యచెక్కడంపనిచేసేవారిని వడ్రంగులని యినుము పనిచేసేవారిని కమ్మరులని కంచుపనిచేసేవారిని కంచర్లని అంటారు-కంసాలీలను వడ్రంగులను కమ్మరులను కంచర్లను యీపేరులు వృత్తినిబట్టి జాతినిబట్టి వచ్చినవి-వారందరు కలిసి భోజనముచేస్తారు-ఒకరిపిల్లను ఒకరు చేసుకుంటారు-వృత్తిలోమట్టుకే భేదము-హిందూదేవాలయములయొక్క గర్భగుడులలోనికి కంసాలిజాతివారిని రానివ్వరు. గ్రామదేవతలగుడులలో కొన్ని బ్రాహ్మణులపూజచేసేవి వున్నవి-కొన్ని యితర జాతులవారుచేస్తారు-గ్రామదేవతలప్రతిష్ఠ షట్కర్మాధికారముగల బ్రాహ్మణులే చేయించవలెను- ప్రతిష్ఠకర్మ బ్రాహ్మణత్వముసాధించునన్న ప్రతివాదు చేయవచ్చును బ్రాహ్మణగోత్రములోపుట్టి శాస్త్రప్రకారము బ్రాహ్మణకన్యను పెండ్లిచేసుకోగా పుట్టినవాడు బ్రాహ్మణుడు- బ్రాహ్మణజాతితెగలలో కంసాలీలుచేరరు. బ్రాహ్మణులను కంసాలీలను పెండ్లిండ్లుగాని పంక్తిభోజనములుగాని నాఅనుభవజ్ఞానములో యెక్కడ లేదు-కంసాలీలఅన్నము చండాలుడిదగ్గరనుంచి తినరు-మేముతినమని యితరజాతుల వారు అంటారు-మేము పెట్టమని కంసాలీలు అంటారు- నేను శ్రుతులు చదువుకున్నాను-వ్యాకరణశాస్త్రము చదువుకున్నాను-వేదములో 4 అట్టములు చెప్పుకున్నాను. తర్కశాస్త్రము ప్రకరణములు చదువుకున్నాను.

చ॥ గురుతర పాండితీకలిత కోవిదనుత్యకవిత్వ లాచుఁ ద
త్పురిప్రజ‡పిల్వ వచ్చి కడుఁబూన్కి నవధానములాచరించు శ్రీ

Cross—సృష్టిఆదియందే జాతులన్ని వున్నవని కొన్ని పురాణములలో ఆదియందు అంతా బ్రాహ్మణులుగా పుట్టి కర్మభ్రష్టతచేత వేరు వేరుజాతులవారయినారని కొన్ని పుస్తకములలోను మొదట అంతా శూద్రులుగా పుట్టిరనియు క్రమేణ తపస్సంపన్నతచేత బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుగా మారి కొంతకాలమైనతరువాత అదినిలుపుకున్నారని కొన్ని పుస్తకములలోను చెప్పబడివున్నది. యెక్కువజాతులవారు తక్కువ జాతులలోకి మారినకాలముగాని తక్కువజాతులవారు యెక్కువజాతులలోకి మారిన కాలముగాని నిర్ణయించుటకువీలులేదు. యెక్కువగ్రంథములలో జాతులసృష్టి ఆదియందేవున్నదని చెప్పబడివున్నది. యికముందు తక్కువజాతివారిని యెక్కువజాతిలోనికి రానివ్వకూడదని నిలుపుకున్నది యేకాలమందో నిర్ణయింపవీలులేదు-కలియుగములో యితరయుగములవలె యితరజాతులవారు బ్రాహ్మణుఁవుటకువీలులేదు. యెక్కువజాతివారు తక్కువజాతివారగుటకు కలియుగములో వీలువున్నది. తక్కువజాతివారు ఎక్కువజాతివారగుటకు వీలులేదు-బ్రహ్మక్షత్రియవైశ్యులకుతప్ప యితరజాతులవారికి వుపనయనాది కర్మాధికారములేదు-బ్రాహ్మణులుసహితము కృషిశిల్పాదులు ఆపద్ధర్మముగా అంగీకరించినా తరువాత ప్రాయశ్చిత్తముచేసుకుంటే మళ్ళీ బ్రాహ్మణత్వము నిలుస్తుంది. అట్లాచేసుకుంటే బ్రాహ్మణత్వమువస్తుందని యాజ్ఞవల్క్యస్మృతి ప్రాయశ్చిత్తకాండ 36 వ శ్లోకములో చెప్పబడివున్నది *Ex V.* ప్రతిష్ఠకర్మముకు మంత్రములు వేదములలోనుండి తీసుకునవలెను-కర్మవిధానము ఆగమములలోవుంటుంది. షోడశకర్మల

గుంటూరు ది **12—8—11**

‡బ్ర॥...పట్టాభిరామశాస్త్రిలు గారికి......నమస్కారములు......బ్ర॥తిర్పతి వేంకటేశ్వరశాస్త్రిలుంగార్ల యొక్క......శతావధానసభ రేపటి **19, 20,** తేదీలలో జరుగున ట్లిచ్చటి పెద్దలచే నిన్న నే ధృవపఱపఁబడినది. రేపు బ్ర॥ శతావధానులు గార్లకు నాహ్వానపత్రిక పోవును. తప్పక సభ జరుగును, సందియము లేదు.....దయ చేయుఁడు...

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

తిరుపతి వెంకటేశ్వర సుధీమణులం దొకరైనయట్టి యా
విరచితసత్ప్రబంధు ఘను వెంకటశాస్త్రిని నేను వేడినన్॥ 82

కూడా మంత్రములు వేదములో చేరుతుంది. ప్రతిష్ట యోజనములో చేరుతుంది గనుక ప్రతిష్ట బ్రాహ్మణుడే చేయించవలెనని చెప్పినాను. బ్రాహ్మణులకుమట్టుకే షట్కర్మాధికారమువున్నది. దేవాలయ ప్రతిష్టకు బ్రాహ్మణునికిమాత్రమే అధికారమువున్నది: నేను గ్రామదేవతలప్రతిష్ట యెన్నడూ చూడలేదు నియోగిబ్రాహ్మణులని వైదికబ్రాహ్మణులని మధ్యపుట్టినవిగనుక యివి శాస్త్రములలో లేవు. కొన్నిచోట్ల కరణాలు అని మూఢత్వముచేత బ్రాహ్మణులలో వకశాఖగా చెప్పుకుంటారు-బ్రాహ్మణులుగానికరణాలు స్రిష్టికరణాలని వున్నారు-కరణమనగా చేయువాడనిఅర్థము-వృత్తినిబట్టి జాతి పుట్టలేదు-ఆదిపురుషునికి బ్రాహ్మణుడు ముఖమున్ను క్షత్రియులు బాహువులు వైశ్యులు తొడలు శూద్రులు పాదములై వున్నారని కొందరి అభిప్రాయము-బ్రాహ్మణులకు గోత్రములు వారి పూర్వపురుషులను బట్టి వచ్చినది-వైశ్యులుకూడా వైశ్యరుషులసంతతివారే- వేదములో చెప్పబడిన రుషులంతా బ్రహ్మరుషులుకారు-వేదములో బ్రహ్మరుషులని చెప్పబడినవారే బ్రహ్మరుషులు-నాలుగు వేదములుచదువని నేను వేదములలో యేమిచెప్పివున్నది చెప్పజాలను. శాస్త్రములలో యెక్కడ కంసాలియిండ్లలో భోజనముచేయగూడదని చెప్పబడివుండలేదు. నేను ఆగమము చదువుకోలేదు- శిల్పశాస్త్రములు చదువుకోలేదు- పురాణములన్నీ సూత్రప్రాయముగా వేదములలో యిమిడివున్నవి- భాగవతము కలియుగములో పుట్టినది. విష్ణుపురాణములో కురుపాండవులను మౌర్యవంశ రాజులను యెత్తినారుగాని అది భారతయుద్ధమునకు పూర్వమే పుట్టినది. 18 పురాణాలు భారతమునకుపూర్వమే పుట్టినవి. వేదములునాలుగు-అవి అనాదిఅయివున్నవి- నేను కంసలివారియిండ్లలో పెండ్లిండ్లకు యెన్నడువెళ్ళలేదు- ఉపనయనముచేసుకుంటే నేగాని బ్రహ్మత్వమురాదు- ఉపనయనము బ్రాహ్మణుడయినవాడేచేయవలెను- స్త్రీకూడా బ్రాహ్మణునిభార్య అవుటవల్ల బ్రాహ్మణిఅని చెప్పబడుతున్నది-మనువువల్ల మానవులు కద్రువవల్ల నాగులు వినతవల్ల

ఉ॥ సాక్షిగవచ్చితానుడివె శాస్త్రపథంబును ద్రోల్గకుండ మ
త్పక్షమునందు, దానిని నపహ్నుతి సేసి యథేచ్ఛఁ గ్రొవ్వుం
బక్షపువారు వ్రాసిరిశియవాచ్యపు వ్రాఁతలు కొంతమంది రూ

---

అనూరుడు గరుత్మంతుడు పుట్టినారుఅని చెప్పబడివున్నది. ఉపనిషత్తులు 10 ప్రమాణములు- శంకరాచార్యులవారు 10 వుపనిషత్తులమట్టుకే భాష్యములుచేసి తక్కినవి వదలినారుగనుక వాటిని గణనలోకితీసుకోరు. అష్టోత్తరశతోపనిషత్తులో 748, 749 పేజీలలో చెప్పబడిన 5 పేర్లు శివపరముగా చెప్పబడినవని నాఅభిప్రాయము. యీ 5 పేర్లు శివునిముఖములపేర్లకు వర్తింపవు-పంచబ్రహ్మఅనగా 5గురు బ్రహ్మలని చెప్పవచ్చును. విస్తరించినబ్రహ్మలని చెప్పవచ్చును. వానిలో విషయమునుబట్టి అర్థనిర్ణయముచేసుకో వలసివుంటుంది. నేను వేదములోవుండే అర్థముమరిచిపోలేదుగాని కంఠోపాఠము మరిచిపోయినాను. శరీరమునకు దహనముచేస్తేనేగాని కర్మపుట్టదు. శవమునుపాతిపెట్టేవారిని కర్మభ్రష్టులని ఆక్షేపించుతాము- లింగధారులు మహమ్మదీయులు క్రయిస్తవులు ఖననముచేస్తారు. కంసాలీలు ఖననముచేస్తారు. కరణశబ్దము యోగరూఢము-నియోగులలో కరణశబ్దమునకు వేరేవుత్పత్తిచెప్పవలెను- బ్రాహ్మణులకు నియమింపబడిన షట్కర్మలు చేయకపోయినంతమాత్రముచేత బ్రాహ్మణుడుకాకపోడుగాని నామమాత్రబ్రాహ్మణుడవుతాడు- షట్కర్మలుచేసేవాడయితే ఆధిక్యతవస్తుంది- నామమాత్రబ్రాహ్మణునికి మంత్రములురావుగనుక చేయించవీలులేదు- వస్తేచేయించవచ్చును- గ్రామపౌరోహితం చేయించేవారు ప్రాయశ్చిత్తములేకుండా ప్రాణప్రతిష్ఠచేయించవచ్చును- వ్యవసాయమేవృత్తిగావున్నా చేయించగలశక్తివుంటే బ్రాహ్మణుడు ప్రతిష్ఠాదియాజనకర్మలు చేయించవచ్చును-కంసాలీలుఅనేశబ్దము వేదములలో తేనుగవుట లేదు.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని...

§ నవంబరు 16 వ తేది 1912 సం॥ (దర్బారు)

సీ॥ ......తెలకొని మీవిరోధులమీది వ్యాజ్యమ్మనను సాక్ష్యమునొసంగి సారటంచు
తే॥గీ॥ వారుమాకైన నారి గుంటూరిశతవ, ధానమును మీరు పక్షపాతమ్ముచేత

క్షేత్రజ్ఞులౌచు వారిపయి నిందున నా కభిమానమం చహా॥ 83

క॥ భువనశ్లాఘ్యంబగు స
త్కవితాప్రాశస్త్యమునను గ్రాలెడి యేత
త్కవివరుల పేరు లెప్పుడు
చెవిఁబడె నభిమానమపుడె చిత్తమునఁబడెన్॥ 84

ఉ॥ పదమూఁడేడుల క్రిందట। నెదియో సందర్భమందు నేనుడివినయ
ట్టిది గలదొక్కటి*పద్య। బది చెప్పెడి వారిమీఁది యభిమానంబున్

తే॥ ప్రీతిఁ బత్రిక మొదలిడి రెండు నెలలు
చనిన శ్రోడన వ్రాసిన ఘనతరంపు
†వ్యాసమే చెప్పఁజాలెడి వారిపైని
నాకుఁగల యభిమానంబు ప్రాకటముగ॥ 86

---

నెంతనుతియించినను నుతియింపవచ్చు, గాని నమ్మెదువారు లోకమునలేరు॥ 15
......................పోచిరాజు సీతారామయ్య, మన్నవ నరసింహము.

(హితకారిణి) 1913 సం॥ డిశంబరు నెల 14 తేది,

...... కే, గంగరాజు గారికిఁ బ్రత్యుత్తరము...... యభినవసరస్వతిని ...... జాన పాటి పట్టాభిరామశాస్త్రి యొక యనవసరపుఁ గేసులోఁ దనపక్షమునఁ గోర్టునందు సాక్ష్యము చెప్పినది మొదలు చెల్లపిళ్ల వెంకటశాస్త్రిగారిపక్షమై తద్విరోధులైన సోదర కవులను దిట్టుటకే యుపయోగించుచుండెను ......

పోతరాజు లక్ష్మీనరసింహము.

*శుభకృత్సంవత్సరమున, ఏకాగోపయ్యగారు నాచేఁ జేయించిన ప్రబంధము

క॥ తిరుపతి వెంకటకవికృత, వరశ్రవణానందపాకవైఖరి నాకే
ధర దుర్లభమనితలఁపకు, మరయఁగ నెవ్వారికేని యది దుర్లభమా॥

†(అభినవసరస్వతి) 1908 సం॥ సెప్టెంబరుసంచిక, స్వవిషయము

......తమరొనరించు గ్రంథములఁ దత్క్షణము ప్రచురించుటకు సరస్వత్యాద్యుత్తమ పత్రికలు యుండినను శతావధానులగు తిరుపతి వెంకటకవులు తమకృపకుఁ బాత్రుఁడఁగా నుపాయనపూర్వకంబుగఁ దనుసమ్ముఖమునకుఁ బంపుకొను నీసంచికల ననుగ్రహదృష్టిచేఁ గైకొనుచు ననన్యకవిసామాన్యమై మృదుమధురశైలిలోఁ గనుపట్టు స్వకృతప్రబంధ మేదయిన దయచేసి యభినవసరస్వతికి వన్నెఁదేఁ సంప్రార్థితులగుచున్నవారు.

క॥ భారతనాటకములనుఁ, వారక నాకనుపుమనుచు వ్రాసిన¶జాబే
యారూఢిఁ జెప్పఁగల ద। వ్వారలపై నెంతగౌరవం బున్నదియుఁ॥

చక్కని శైలిగల పెక్కుప్రబంధములు ప్రచురింపించి సరస్వతిని గర మలంకరింపఁజేసిన మహాకవులు తత్కనిష్ఠయగు నభినవసరస్వతియెడల మాత్రము దయాళువులేల కాకుందురు?

---

జానపాడు. 29—7—10

¶శ్లో॥ నమశ్శ్రీవెంకటాఖ్యాక విద్వదంఘ్ర్యంబుజన్మనే
వ్యాప్తరాజోత్తమాంగస్థ కిరీటమణిరోచిషే॥ 1

శ్లో॥ ఆరూఢః కవితాగథం ఝుడితి సర్వాశాసు సంచార్యచ
విద్వద్రాజసభాః ప్రవిశ్య నిజసద్విద్యాః ప్రదర్శ్యాధికం
హేలానిర్జితదుర్విపశ్చిదనఘో యః ప్రాప కీర్తింస్థిరాం
తం శ్రీవెంకటశాస్త్రిణం ప్రతి నమస్యా చెళ్లపిళ్లాన్వయం॥ 2

శ్లో॥ వక్త్రాన్నిర్యదశేషవాక్యనిచయే పద్యాత్మనావర్తతి
హృద్యగ్రంథేషు భృశం లసత్సు బహుశో యుష్మత్ప్రణీతేషు వై
లేఖాః ప్రాహిణుమోస్మదాదయ ఇమే పద్యాత్మకా వః ప్రతి
నిర్లజ్జోయమశేషలోక ఉతభో నీకాశరాహిత్యవాన్!॥ 3

శ్లో॥ విముఖా భవంతు భూపా విద్యావంతో భవంతు దాతారః
ఆగత్యభిక్షుకజనో పభ్రంశానేవ సర్వదా పఠతి॥ 4

శ్లో॥ తిరుపతివెంకటకవ్యో ర్వాణ్యాః పురుషావతారయో ర్భవతోః
ఖ్యాతిర్బహుకాలాదపి కర్ణపథం ప్రాప్య వర్తతేస్మాకం॥ 5

శ్లో॥ పరితశ్శ్రవణానందో పశ్చాచ్ఛ్రీబుద్ధచరితమపి దృష్టం
పాండవవిజయప్రముఖా బహుసద్గ్రంథాశ్చ బాఢముద్గీతాః॥ 6

శ్లో॥ కాంశ్చిదదృష్ట్వా గ్రంథాన్ గతసౌమ్యాబ్దేతు శ్రీమదభ్యాశం
పత్రేలిఖితేస్మాభిః పాణిగృహీతాది ప్రేషితం ఖలు భో॥ 7

శ్లో॥ క్వ యూయం భారతీరూపాః క్వాహమల్పకలాయుతః
తథాపి వీక్ష్య మల్లేఖాం ప్రేషితం పుస్తకత్రయం॥ 8

శ్లో॥ లేఖాం విలిఖ్య సుచిరాదపి నేతుమిచ్ఛన్ త్వన్నిధిం త్వదుపరిస్థితగౌరవేణ
ఈదృఙ్మహత్త్వకలితో బత మాదృశాంచ ప్రత్యుత్తరం నలిఖతీతి విశంకితోస్మి॥ 9

ఆ॥ రామకృష్ణకవుల రన్వాకూరంభమా
సమయమందు వారిసమ్ముఖమున
కనిభిసట్టిక లేఖయును వచియించెడి
వారిమీఁదనాకు వరలుభక్తి॥ 88

---

శ్లో॥ అభినవసరస్వతీమహా మారభ్య ప్రేషయన్ త్వదభ్యాశం
యుంకరవాత్వద్గ్రంథం ప్రకటీకర్తుంహి కాంతుమాశోస్మి॥ 10

శ్లో॥ అముద్రితగ్రంథవిహాపితాయ శ్రీమా ననుత్పన్నఘృణోపి బాఢం
సుముద్రితాన్ప్రేష్య సదాత్రదేశే సమస్తలోకైః పరిగీయసేభోః॥ 11

శ్లో॥ అపభ్రంశపద్యాన్ లిఖిత్వాస్మదాద్యైర్జనైః ప్రేష్యమాణే ఘనగ్రంథదాతా
భవంతంవినాకః ప్రకాశేతభూమ్యాం నిగర్వో దయావాన్ భవాన్ సర్వమాంశ్చ॥

శ్లో॥ ప్రకృతంకవివర! దయయా పాండవజవనాది చాశ్వమేధాంతం
శ్రీమత్కృతయో నేయా భో మత్వామిాప్య మన్మదీయఇతి॥ 13

శ్లో॥ మత్పరిచరీక్రియమాణే మతవిషయే వ్యాసరూపవాచోవా
నహిదేయాఃకిం శ్రీమన్! నానారసగుంభితా స్త్వదీయాభోః॥ 14

శ్లో॥ భవతిస్థితయాభక్త్యా పద్యానలిఖం కవీశ్వరత్వాన్న
తత్కాంతవ్యాదోషా స్త్వత్పదపద్మం నమస్కరోమ్యార్య!॥ 15

---

జానపాడు 6—10—10

క॥ నిండుకృపన్ మీరనిచిన, పాండవవిజయాదికముల బహుభక్తిని నిం
డుండి పఠింపుచునుంటిమి, పండితజనవినతపాదపంకజయుగళా!॥ 1

తే॥ గ్రంథములఁబంపుటయెకాక కరుణతోడ, "వ్యాసము విమర్శ మోవ్రాశిపంపుడు"నని
వ్రాసినటువంటి యాయక్షరములపంక్తిఁ, జదివిపలుమారు సంతోషజలధిఁబడితి॥ 2

ఉ॥ నమ్మఁడు నమ్మకుండుఁ డఘనాతనసత్కవులందె గాక పూ
ర్వమ్మున మేటిగ్రంథముల వ్రాసినవారలలోనఁగూడ ని
క్కమ్ముగఁ ద్వత్సమానులిలఁ గానఁగరారని నాదునిశ్చయం
బమ్మక చెల్ల యిట్లనియెనంచువచించినఁగాని కాకవుల్॥ 3

తే॥ భారతాదుల సరసపుంబద్యరచన। యసలెతేదనికాఁదచ్చటుచటఁ గొన్ని
పద్యములుకానఁబడుచుండు, త్వత్ప్రబంధములను నన్నియు రసవంతము లెపఠింప॥ 4

క॥ భారతనాటకములనుఁ, వారకనాకనుపుమనుచు వ్రాసిన జాబే
యారూఢిఁ జెప్పఁగల ద॥ వ్వారలపై నెంతగౌరవం బున్నదియుఁ॥

చక్కని శైలిఁగల పెక్కు ప్రబంధములు ప్రచురింపించి సరస్వతిని గర మలంకరింపఁజేసిన
మహాకవులు తత్కనిష్ఠయగు నభినవసరస్వతియెడల మాత్రము దయాళువులేల కాకుందురు?

---

జానపాడు. 29—7—10

శ్లో॥ నమశ్శ్రీవెంకటాఖ్యాయ విద్వదంఘ్ర్యంబుజన్మనే
వ్యాప్తరాజోత్తమాంగస్థ కిరీటమణిరోచిషే॥ 1

శ్లో॥ ఆరూఢః కవితారథం ఝుడితి సర్వాశాసు సంచార్యచ
విద్వద్రాజసభాః ప్రవిశ్య నిజసద్విద్యాః ప్రదర్శ్యాధికం
హేలానిర్జితదుర్విపశ్చిదసఘో యః ప్రాప కీర్తింస్థిరాం
తం శ్రీవెంకటశాస్త్రిణం ప్రతి నమస్యా చెళ్లపిళ్లాన్వయం॥ 2

శ్లో॥ వక్త్రాన్నిర్యదశేషవాక్యనిచయే పద్యాత్మనావర్తతి
హృద్యగ్రంథేషు ధృశం లసత్సు బహుశో యుష్మత్ప్రణీతేషువై
లేఖాః ప్రాహిణుమోస్మదాదయ ఇమే పద్యాత్మకా వః ప్రతి
నిర్లజ్జోయ మశేషలోక ఉతభో నీకాశరాహిత్యవాన్!॥ 3

శ్లో॥ విముఖా భవంతు భూపా విద్యావంతో భవంతు దాతారః
ఆగత్యభిక్షుకజనో పభ్రంశానైవ సర్వదాపతతి॥ 4

శ్లో॥ తిరుపతివెంకటకవ్యో ర్వ్యాణ్యాః పురుషావతారయో ర్భవతోః
ఖ్యాతిర్బహుకాలాదపి కర్ణపథం ప్రాప్య వర్తతేస్మాకం॥ 5

శ్లో॥ పరితశ్శ్రవణానందో పశ్చాచ్ఛ్రీబుద్ధచరితమపి దృష్టం
పాండవవిజయప్రముఖా బహుసద్గ్రంథాశ్చ బాధముద్రితాః॥ 6

శ్లో॥ కాంశ్చిదదృష్ట్వాగ్రంధాన్ గతసౌమ్యాబ్దేతు శ్రీమదభ్యాశం
పత్రేలిఖితేస్మాభిః పాణిగృహీతాది ప్రేషితం ఖలుభోః॥ 7

శ్లో॥ క్వయూయం భారతీరూపాః క్వాహ మల్పకలాయుతః
తథాపి వీక్ష్య మల్లేఖాం ప్రేషితం పుస్తకత్రయం॥ 8

శ్లో॥ లేఖాం విలిఖ్య సుచిరాదపి నేతుమిచ్ఛన్ త్వన్నిధిం త్వదుపరిస్థితగౌరవేణ
ఈదృఙ్మహత్త్వకలితో బతమాదృశాంచ ప్రత్యుత్తరం నలిఖతీతి విశంకితోస్మి॥ 9

ఆ॥ రామకృష్ణకవుల రన్వయారంభమహా
సమయమందు వారిసమ్ముఖమున
కనిపిసట్టిలేఖయును వచియించెడి
వారిమీఁదనాకు వరలుభక్తి॥

---

శ్లో॥ అభినవసరస్వతీమహా మారభ్య ప్రేషయన్ త్వదభ్యాశం
యంకంవాత్వద్గ్రింథం ప్రకటీకర్తుంహి కాంతుమాశోస్మి॥

శ్లో॥ అముద్రితగ్రంథవిహాపితాయ శ్రీమా ననుత్పన్నఘృణోపి బాఢం
సుముద్రితాన్పేషిష్య సదాత్రదేశే సమస్తలోకైః పరిగీయసేభ్యాః॥

శ్లో॥ అపభ్రంశపద్యాన్ లిఖిత్వాస్మదాద్యైర్జనైః ప్రేష్యమాణే ఘనగ్రంథదా
భవంతంవినాకః ప్రకాశేతభూమ్యాం నిగర్వో దయావాన్ భవాన్ సత్సమాఁ

శ్లో॥ ప్రకృతంకవివర! దయయా పాండవజననాది చాశ్వమేధాంతం
శ్రీమత్కృతయోఽనేయా భో మత్స్వామీప్య మస్మదీయఇతి॥

శ్లో॥ మత్పరిచరిక్రియమాణే మతవిషయే వ్యాసరూపవాచోవా
నహిదేయాఃకిం శ్రీమన్! నానారసగుంభితా స్త్వదీయాభో॥

శ్లో॥ భవతిస్థితయాభక్త్యా పద్యానలిఖం కవీశ్వరత్వాన్న
తత్క్షంతవ్యాదోషా స్త్వత్పదపద్మం నమస్కరోమ్యార్య!॥

---

జానపాడు 6—10—10

కః నిండుకృపన్ మీరనిచిన, పాండవవిజయాదికముల బహుభక్తిని నిం
డుండి పఠింపుచునుంటిమి, పండితజనవినతపాదపంకజయుగళా!॥

తే॥ గ్రంథములఁబంపుటయుకాక కరుణతోడ, "వ్యాసము" విమర్శమొప్రాసిపంపుదు
వ్రాసినటువంటి యాయక్షరములపంక్తిఁ, జదివిపలుమారు సంతోషజలధిఁబడితి

ఉ॥ నమ్ముఁడు నమ్మకుండుఁ డఘనాతనసత్కవులందెగాక పూ
ర్వమ్మున మేటిగ్రంథములవ్రాసినవారలలోనఁగూడ ని
క్కమ్ముగఁ ద్వత్సమానులిలఁ గానఁగరారని నాదునిశ్చయం
బమ్మకచెల్ల యిట్లనియనంచువచించినఁగాని కాకవుల్॥

తే॥ భారతాదుల సరసపుంబద్యరచన। యసలెలేదనికా దచ్చటచటఁ గొన్ని
పద్యములుకానఁబడుచుండు, త్వత్ప్రబంధములను నన్నియు రసవంతము లెపతిఁ

# ప్రధానపోషకులు.

1. శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2. శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు గంపలగూడెం

## సహాయులు.

14. కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.
15. తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజఱ్ఱంపాడు.
16. వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
17. తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
18. గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కార్టుబ్రదర్సుకంపెనీ.
19. శేకుమళ్ళ గోపాలరావుగాసు, కరణం, అమిదీపురం.

పోషకులు

1. పెద్దిభట్ల లక్ష్మీనరసింహముగారు, వకీలు, తెనాలి.
2. యం. శ్రీనివాసరావుగారు, హెడ్మాష్టరు, గుంటూరు.
3. భువనగిరి అమరయ్యగారు, బయ్యవరం.
4. ఉలిగుండం రంగారావుగారు, వకీలు, గుంటూరు.
5. మందపాటి నరసింహారావుగారు, గుంటూరు.
6. పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు, రివిన్యూయినస్పెక్టరు, కొల్లిపర.
7. అక్కిరాజు శంకరనారాయణగారు, గ్రామమున్సిఫ్ మాచవరం
8. చింతపల్లి రామస్వామిగారు, ఆ॥ కరిణం పెదకొదమగుండ్ల.
9. ఘుడియారం వెంకటాచలశాస్త్రిగారు, ప్రొద్దుటూరు.
10 యియ్యుణ్ణి అనంతపద్మనాథదేసికాచార్యులుగారు,
వెంకటాద్రిమునిమోరివాణిపేట.
11. భువనగిరి ముకుందరామయ్యగారు, రివిన్యూయినస్పెక్టరు,
కాకుమాను
12. లంకా నాగయ్యగారు, పెదకొదమగుండ్ల.
13 లక్ష్మిరాజు వెంకటసుబ్రహ్మణ్యముగారు, కొత్తనూరు.

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొక మాసపత్రిక-ఇందు ప్రాచీనవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపఁబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనఁగలుగు నానందము గాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందాసంవత్సరమునకు రు 2-0-0

### ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | ఆశ్వలాయనాచార్యవిజయము ... | ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరి వీరభద్రకవి) ... | ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము ... } | ... | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండు నాటకములు | ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు ) | ... | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర ... | .... | 0-2-0 |
| 7 | నీతిగీతులు. ( సుమతి శతకమునకు సంస్కృతము ) | ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | ... | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు. వెంకటరామకృష్ణకవులయవధానములపై విమర్శనము } | ... | 0-5-0 |
| 10 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) | ... | 0-4-0 |
| 11 | సంగదోషము. ( సంగదోషమున్ చేబట్టుదలవదలని యోగుల చరిత్ర దెలుపు నొకచిన్న పద్యరూపమగు కథ } | ... | 0-3-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) | ... | 1-4-0 |
| 13 | పులిందావివాహము ( పత్రికాధిపతి) | ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | | 0-4-0 |
| 15 | శివానందలహరి. ( తంగెడ రామకృష్ణకవి ) | ... | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము( రాయసము వెంకటపతి ) | ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతి వెంకటీయము ) | ... | 0-3-0 |
| 18 | పశ్యంపుశ్యం ,, | | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, | ... | 0-2 0 |
| 20 | [illegible] శతావధానము ,, | | 0-12-0 |
| 21 | పురశ్చరణము ,, | | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని, వి. పి. ద్వారాగాని, ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.